శ్రీ ర స్తు

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# వ్యవసాయ వ్యాఖ్యానార్థదర్పణము

## వ్యవసాయ సామెతలు 601


గ్రంథసంధాత

నేదునూరి గంగాధరము



యస్. అప్పలస్వామి అండు సన్సు వారిచే

కాపీరైటు హక్కును పొంది

ప్రకాశకులు :

సి. వి. కృష్ణా బుక్‌డిపో,

19/99. అప్పర్సు కోవిల్ వీధి,

వాల్‌టాక్సు రోడ్డు పోస్టు, మదరాసు.1.





దీనివెల] 1956 [1-0-0

శ్రీ ర స్తు

# విషయసూచిక

—:*:—

వి ష య సూ చి క

స ం పూ ర్ణ ము



# పండితాభిప్రాయము

శ్రీ నేమనూరి గంగాధరమూర్తిచే వ్రాయబడిన యీ వ్యవసాయ ముహూర్తదర్పణమను గ్రంథరాజమును నేను సంపూర్ణముగా చదివి చాలా సంతోషము పొందితిని. యీ గ్రంథములో రైతులకు వ్యవసాయమునకు ముఖ్యముగా పనికివచ్చు విషయములు ఏ కాలమందు ఏ కర్మను చేసినవారికి అనుకూలఫలదాయకమై బహుద్రవ్యలాభాదులకు పశువృక్ష సస్యాదులకు సమృద్ధిగలిగి సుఖములభించునో అట్టి కాలములను వ్యవసాయావసర ప్రతి ముఖ్యకార్యమునకు శుభకాల ముహూర్తాదులను వివరించి వ్రాసియున్నారు. యీ గ్రంథము వ్యవసాయమునకుపయోగించుటలో అమోఘమై వ్యవసాయదారులను సుఖసంపదలతో నెల్లప్పుడు సుఖవంతులనుగా చేయుననుట అతిశయోక్తిగాదు.

ఇందులో నుదహరించిన ప్రకారము పశువులను కట్టుటకు హాలకర్మకు బీజావాపనమునకు యీ మొదలగు అనేక విషయములకు హితమును చేకూర్చు కాలముల నుదహరించి జనులను ధనధాన్యాదులతో సుభిక్షవంతులనుచేయు యీ గ్రంథమును రచించిన శ్రీ గంగాధరముగారు వ్యవసాయదారులకు వ్యవసాయఫల మనుభవించు సర్వజనానీకమునకు అభినందనీయులై యున్నారు. ఈ గ్రంథము ప్రస్తుతములోని పండితు లెవ్వరున్ను యింత విమర్శించి వ్రాసియుండలేదు. ఈ గ్రంథము ప్రజలందరిచేత మన్నింపబడునని విశ్వసించుచున్నాను.

ఇట్లు

"దైవజ్ఞ"
మధుర కృష్ణమూర్తిశాస్త్రి

# చెప్పని మాటలు

శాస్త్రాభిమానులకు వందనములు.

ఆప్తులారా!

భారతదేశమున కల ప్రాచీన శాస్త్రములను, మన భారతఖండమునందు ప్రాచీనమహర్షులు తమకు తెలిసినవానిని పరిరక్షించి పరంపరగా నిషిద్ధశాస్త్రము లనకు నిలిపియుంచి యున్నారు. మేటిశాస్త్రములు రానురాను లఘు రూపములు దాల్చినవి.

జ్యోతిశ్శాస్త్రములు చాలవఱకు మరుగుపడినవి. మిగిలినవియైనను విద్వజ్జనుల కందుబాటులో నున్నవే కాని; మామూలు ప్రజానీకమున కందుబాటులో లేవు.

ప్రపంచమునకు జీవనాధారమైనది వ్యవసాయము. ఇట్టి పవిత్ర వంతమగు యీకృషికి మంచిచెడ్డలను నిర్ణయించుచు ప్రాచీనులు కొన్ని సూక్తులను రచియించిరి. అయ్యవి వివిధగ్రంథాంతర్భూతములై యున్నవే కాని, ప్రత్యేకించి లేవు.

“లోకమునకు వెన్నెముక యనదగిన రైతునకు యీసూక్తులానశ్లోకము లేకదా? యిట్టి ఋషిప్రోక్తములను, ఏర్చికూర్చి రైతు లోకమున కందుబాటు చేయుము” అని నన్ను ప్రోత్సహించిన శ్రీ యస్. అప్పలస్వామిగారు ధన్యులు.

నేను నాశక్త్యనుసారము యీవ్యవసాయ ముహూర్తదర్పణ మును దీని కనుబంధముగా వ్యవసాయ సామెతలను యీగ్రంథరూప ముగా రచియించి యున్నాడను—అనుకరణ గ్రంథకారుల అఘాయి త్యములను జూచి కొన్ని మూలశ్లోకములను పేర్కొనలేదు.

ఇందలి నాభ్రాంతి ప్రమాదములను, విజ్ఞులు తెలియపర్చినచో ద్వితీయ ముద్రణమునందు, సవరించుకొందునని యిందుమూలముగా వందనము లాచరించుచున్నాడను.

విద్వజ్జన విధేయుడు

నేదునూరి గంగాధరం

# 27 నక్షత్రముల స్వభావ సారిణి

| సంఖ్య | నామనక్షత్ర సంజ్ఞలు 1 2 3 4 | నక్షత్రము | స్వభావము | గణము | యోని |
|---|---|---|---|---|---|
| 1 | చూ చే చో లా | అశ్విని | క్షిప్ర | దేవ | అశ్వము |
| 2 | లీ లూ లే లో | భరణి | ఉగ్ర | మానుష | గజము |
| 3 | అ ఇ ఉ ఏ | కృత్తిక | మిశ్ర | రాక్షస | మేషము |
| 4 | ఓ వా వీ వూ | రోహిణి | స్థిర | మానుష | సర్పము |
| 5 | వే వో కా కి | మృగశిర | మృదు | దేవ | సర్పము |
| 6 | కూ ఖ ఙ ఛా | ఆరుద్ర | దారుణ | మానుష | శ్వానము |
| 7 | కే కో హా హి | పునర్వసు | చర | దేవ | మార్జాలము |
| 8 | హూ హే హో డా | పుష్యమి | క్షిప్ర | దేవ | మేషము |
| 9 | డీ డూ డే డో | ఆశ్లేష | దారుణ | రాక్షస | మార్జాలము |
| 10 | మా మీ మూ మే | మఖ | ఉగ్ర | రాక్షస | మూషకము |
| 11 | మో టా టీ టూ | పుబ్బ | ఉగ్ర | మానుష | మూషకము |
| 12 | టే టో పా పి | ఉత్తర | స్థిర | మానుష | గోవు |
| 13 | పూ షం ణా ఠా | హస్త | క్షిప్ర | దేవ | మహిషము |
| 14 | పే పో రా రీ | చిత్త | మృదు | రాక్షస | వ్యాఘ్రము |
| 15 | రూ రే రో తా | స్వాతి | చర | దేవ | మహిషము |
| 16 | తీ తూ తే తో | విశాఖ | మిశ్ర | రాక్షస | వ్యాఘ్రము |
| 17 | నా నీ నూ నే | అనూరాధ | మృదు | దేవ | మృగము |
| 18 | నో యా యీ యూ | జ్యేష్ఠ | దారుణ | రాక్షస | మృగము |
| 19 | యే యో బా బీ | మూల | దారుణ | రాక్షస | శ్వానము |
| 20 | బూ ధా భా ఢా | పూ॥షా॥ | ఉగ్ర | మానుష | మర్కటము |
| 21 | బే బో జా జీ | ఉ॥షా॥ | స్థిర | మానుష | నకులము |
| 22 | జూ జే జో ఖా | శ్రవణం | చర | దేవ | మర్కటము |
| 23 | గా గీ గూ గే | ధనిష్ఠ | చర | రాక్షస | సింహము |
| 24 | గో సా సీ సూ | శతభిషం | చర | రాక్షస | అశ్వము |
| 25 | సే సో దా దీ | పూ॥భా॥ | ఉగ్ర | మానుష | సింహము |
| 26 | దు శ్యం ఝ థ | ఉ॥భా॥ | స్థిర | మానుష | గోవు |
| 27 | దే దో చా చి | రేవతి | మృదు | దేవ | గజము |

## సంయుక్త నామనక్షత్రములు

కృష్ణుడనుపేరు మృగశిర 3 వ పాదము, ధృష్ణుడు స్వాతి 1 వ పాదము, శ్రీధరుడు చిత్త 4 వ పాదము. క్షేత్రపాలుడు హస్త 2 వ పాదము, జ్ఞానుడు ఆర్ద్ర 3 వ పాదము, భీముడు మూల 3 వ పాదము, క్షేమము పునర్వసు 1 వ పాదము, ఫణి ఉత్తర 1 వ పాదము, ద్రోణ ద్రౌపది స్వాతి 3 వ పాదము, యుల్లస, గోరోచన, యగ్ని, వరుసగా మూల 1, 2, 3, 4 వ పాదములు.

## నక్షత్ర పాద రాసులు

ప్రతినక్షత్రము 4 పాదములుగల్గి యుండును. అట్టి పాదములు తొమ్మిదయినచో ఒక రాశియగును. 27 నక్షత్రములు 108 పాదములు 12 రాసులు అగును.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | 4 | 1 మేషం | మృగశిర | 2 | 3 మిధునం | మఖ | 4 | 5 సింహం |
| భరణి | 4 | | ఆరుద్ర | 4 | | పుబ్బ | 4 | |
| కృత్తిక | 1 | | పునర్వసు | 3 | | ఉత్తర | 1 | |
| కృత్తిక | 3 | 2 వృషభం | పునర్వసు | 1 | 4 కర్కాటకం | ఉత్తర | 3 | 6 కన్య |
| రోహిణి | 4 | | పుష్యమి | 4 | | హస్త | 4 | |
| మృగశిర | 2 | | ఆశ్లేష | 4 | | చిత్త | 2 | |
| చిత్త | 2 | 7 తుల | మూల | 4 | 9 ధనస్సు | ధనిష్ఠ | 2 | 11 కుంభం |
| స్వాతి | 4 | | పూ॥షా॥ | 4 | | శతభిషం | 4 | |
| విశాఖ | 3 | | ఉ॥షా॥ | 1 | | పూ॥భా॥ | 3 | |
| విశాఖ | 1 | 8 వృశ్చికం | ఉ॥షా॥ | 3 | 10 మకరం | పూ॥భా॥ | 1 | 12 మీనం |
| అనూరాధ | 4 | | శ్రవణం | 4 | | ఉ॥భా॥ | 4 | |
| జ్యేష్ఠ | 4 | | ధనిష్ఠ | 2 | | రేవతి | 4 | |

పుట్టిన నక్షత్రములను జనన నక్షత్రములనియు, పేరు మొదటి అక్షర నక్షత్రములను నామనక్షత్రములనియు, సూర్యసంచార నక్షత్రములను కార్తెలనియు, చంద్రసంచార నక్షత్రములను నిత్యనక్షత్రములనియు చెప్పుదురు.

## 12 రాసుల స్వభావసారిణి

| సంఖ్య | రాశి పేరు | స్వభావము | ఆధిపత్య గ్రహాములు |
|---|---|---|---|
| 1 | మేషము | చరము | కుజుడు |
| 2 | వృషభము | స్థిరము | శుక్రుడు |
| 3 | మిధునము | ద్విస్వభావము | బుధుడు |
| 4 | కర్కాటకము | చరము | చంద్రుడు |
| 5 | సింహాము | స్థిరము | రవి |
| 6 | కన్య | ద్విస్వభావము | బుధుడు |
| 7 | తుల | చరము | శుక్రుడు |
| 8 | వృశ్చిక | స్థిరము | కుజుడు |
| 9 | ధనస్సు | ద్విస్వభావము | గురుడు |
| 10 | మకరము | చరము | శని |
| 11 | కుంభము | స్థిరము | శని |
| 12 | మీనము | ద్విస్వభావము | గురుడు |

9 గ్రహముల స్వభావసారిణి

| సంఖ్య | గ్రహము పేరు | స్వక్షేత్రము | మూలత్రికోణములు | శత్రులు | మిత్రులు | సములు |
|---|---|---|---|---|---|---|
| 1 | సూర్యుడు | సింహము | సింహము | శనిశుక్రులు | చంద్రకుజగురు | బుధ |
| 2 | చంద్రుడు | కర్కాటకం | వృషభము | | రవిబుధ | కుజశుక్రగురుశని |
| 3 | బుధుడు | కన్యమిధునములు | కన్య | చంద్రుడు | శుక్రరవి | కుజగురుశని |
| 4 | గురుడు | ధనుర్మీనములు | ధనుస్సు | బుధశుక్ర | రవికుజచంద్రులు | శని |
| 5 | కుజుడు | మేషవృశ్చికములు | మేషము | బుధ | గురురవిచంద్రులు | శుక్రశని |
| 6 | శుక్రుడు | వృషభతులలు | తుల | రవిచంద్ర | శనిబుధ | కుజగురు |
| 7 | శని | మకరకుంభములు | కుంభము | రవిచంద్రకుజ | శుక్రబుధ | గురు |
| 8 | రాహు | కన్య | కర్కాటకము | రవిచంద్రకుజ | శుక్రశని | గురుబుధ |
| 9 | కేతువు | మీనము | మకరము | శుక్రశని | రవిచంద్రకుజ | గురుబుధ |

# తారాబలము

నామనక్షత్రముగాని, లేక జన్మనక్షత్రముగాని, మొదలుకొని, నిత్యనక్షత్రమువరకు గణించి, ఆసంఖ్యను 9 చే భాగింపగా మిగిలిన శేషము తారయనబడును. సున్న వచ్చినచో 9 దవ తారగా గ్రహింపవలెను. తారాబల వివర మీక్రింది చక్రమును చూడుడు.

| సంఖ్య | తార నామము | ఫలము | తారాధిపతులు | అధిపతి ఫలములు | వాహనములు | వాహన ఫలములు | దోషఘుడియలు | దోషశాంతికి దానములు |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | జన్మతార | దేహనాశనము | రవి | తాపము | నెమలి | మనస్తాపము | 3వపాదం 5గడియలు | శాకము |
| 2 | సంపత్ | సంపద | చంద్రుడు | లాభము | అశ్వము | అర్థాగమము | శుభము | ,, |
| 3 | విపత్ | దరిద్రము | రాహు | క్షితి | మేషము | కలహము | 1వపాదం 10గడియలు | గుడము |
| 4 | క్షేమ | క్షేమము | గురు | ధృతి | గజము | లక్ష్మీప్రాప్తి | శుభము | ,, |
| 5 | ప్రత్యక్ | కార్యనాశనము | కేతు | లయము | వాయసము | కార్యనాశము | 4వపాదం 5గడియలు | లవణము |
| 6 | సాధన | కార్యసాధనము | చంద్ర బుధ | కీర్తి | జంబుకము | సుఖము | శుభము | ,, |
| 7 | నైధన | మరణము | శని | హాని | సింహము | రణభయము | 2వపాదం 11గడియలు | సతిలకాంచనం |
| 8 | మిత్ర | సౌఖ్యసంపత్తులు | శుక్ర | మోదము | గరుడ | సుఖము | శుభము | ,, |
| 9 | రమమిత్ర | సుఖలాభములు | కుజ | మృత్యువు | హంస | కార్యవికలము | శుభము | ,, |

హరిహర హిరణ్య గర్భేభ్యోనమః

శ్రీ శారదాంబాయైనమః

అస్మద్గురుబృందపాదార వింధాభ్యాం ప్రణుతిః

# వ్యవసాయ ముహూర్త దర్పణము

—:*:—

## ప్రార్థన

శ్లో॥ రామాద్యాచయ మేదినీమ్,
ధనపతే బీజం బలాల్లాంగలమ్
ప్రేతేశాన్మహిషం తదాస్తి
వృషభం పాలం త్రిశూలం కురు
శక్తానాంత వచాన్నధాన కరణే
గోరక్షణౌ షణ్ముఖః।
ఖిన్నాహం హరభిక్షయా।
కర కృషిగౌరీవచః పాతునః॥

తా॥ సర్వలోక ప్రదాయినియగు, శ్రీ పార్వతీదేవి ఈశ్వరునిఁ జూచి "నాథా! పరశురాముఁడు భూమినిచ్చును, కుబేరుఁడు విత్తనముల నిచ్చును, బలరాముఁడు నాగలినిచ్చును, నీ త్రిశూలము కఱ్ఱుగా వేయవచ్చును. నీవడిగిన చో యముఁడు దున్నపోతునిచ్చును. దానికి జతచేయుటకు మనయెద్దు పనికివచ్చును. నేను చేనులోనికి యన్నము తెచ్చెదను. కుమారస్వామి పశువులను కాయును. కావున, నాకు సరి వారిలో నవ్వులాటలుగల నీభిక్షాటన వృత్తి మానివేయుము. వెంటనే ప్రయత్నించి వ్యవసాయమును చేయుము." అని భర్తను హెచ్చరించెడి లోకమాతయగు గౌరీదేవి రక్షించునుగాక.

## వ్యవసాయ ప్రశంస

వ్యవసాయవృత్తి సర్వదేశములందును, సర్వజనాంగముచేతను, సర్వకాలములందును, సర్వవిధముల సంస్తుతింపఁబడినది. "ధాన్యలక్ష్మితో ధనలక్ష్మి ఓపదు" ఈ సామెత మన తెలుఁగు దేశమున వాడబడుచున్నది.

"తల్లి పెంచగవలయు । ధరణిపెంచగవలయు"

"తల్లి యిచ్చినపాలుకన్న । ధరణిపెంచగవలయి"

ఈ ఆర్యోక్తులు కృషియొక్క ప్రఖ్యాతిని ప్రకటించుచున్నది.

ఇతర వృత్తులకన్న, వ్యవసాయము మిక్కిలి మంచిది.

"కృషితోనాస్తి దుర్భిక్షం । జపతోనాస్తి పాతకమ్"

పై సంస్కృతలోకోక్తి ప్రకారం, కృషివలన కఱువు లుండవు. కఱువులేని దేశమునందు ప్రజలు సుఖజీవనము గడుపుదురు.

సర్వప్రపంచమునకు జీవనాధారమైన యీపవిత్రవృత్తికి శుభాశుభములను ప్రాచీన మహర్షులు రచియించియున్నారు. అట్టి ప్రాచీన రచనలనుండి—వ్యవసాయమునకు కావలసిన ముహూర్తములను—సేకరించి, "వ్యవసాయ ముహూర్తదర్పణము" అనుపేర దీనిని—రచియించి యున్నాడను.

## (4) 60 సంవత్సరము-వాటిఫలములు (రెడ్డిమతశాస్త్రము)

1 ప్రభవ—పంటలు తగుమాత్రము పండును. కొఱ్ఱలు, రాగులు, మినుములు సంపూర్ణముగా పండును. వానలు తక్కువ.

2 విభవ—కొలదివర్షము కురియును. వెలిపైరులు ఫలించును. పశువులు క్షేమముగా నుండును.

3 శుక్ల—వానలు సమృద్ధిగా నుండును, పంటలుబాగుగా పండును.

2 బహుళ పక్షము 15 దినములు చీకటిగలది.

పక్షమున 15 తిధులుండును.

## తిధులు

1 పాడ్యమి 2 విదియ 3 తదియ 4 చవితి 5 పంచమి 6 షష్టి 7 సప్తమి 8 అష్టమి 9 నవమి 10 దశమి 11 ఏకాదశి 12 ద్వాదశి 13 త్రయోదశి 14 చతుర్దశి 15 పూర్ణిమ 30 అమావాస్య

## పంచపర్వములు

కృష్ణాష్టమి, చతుర్దశి, పూర్ణిమ, అమావాస్య, సంక్రాంతి

## తిధులకు సంజ్ఞలు

1—6—11 నంద తిధులు
2—7—12 భద్ర తిధులు
3—8—13 జయ తిధులు
4—9—14 రిక్త తిధులు
5—19—50 పూర్ణ తిధులు

## వారములు విశేషాంశములు

| వారములు | రాహు కాలము | గుళిక కాలము | వారశూల | వర్జ్య కాలము | దుర్ముహూర్తములు |
|---|---|---|---|---|---|
| 1 ఆదివారము | ౨౬। | ౨౨½ | పడమర | ౧౪ | ౧౪-౦ |
| 2 సోమవారము | ౩¾ | ౨౮¾ | తూర్పు | ౮ | ౯-౨౨ |
| 2 మంగళవారము | ౨౨½ | ౧౫ | ఉత్తరము | ౧౨ | ౪-౨౦ |
| 4 బుధవారము | ౧౫ | ౧౧। | ఉత్తరము | ౧౨ | ౪- ౦ |
| 5 లక్ష్మీవారము | ।౮¾ | ౭½ | దక్షిణము | ౨౨ | ౬-౧౨ |
| 6 శుక్రవారము | ౧౧। | ౩¾ | పడమర | ౧౫ | ౯- ౪ |
| 7 శనివారము | ౭½ | ౦ | తూర్పు | ౮ | ౨- ౧ |

వివరము:— ఈ చక్రములో చూపబడిన కాలమునకు పైన 3-4 గడియలు ఆయా దోష కాలములు వ్యాపించి యుండును. రాహు కాలములో శుభములు, గుళిక కాలములో అశుభములు చేయరాదు.

## 27 యోగములు

1 విష్కంభము 2 ప్రీతి 3 ఆయుష్మాన్ 4 సౌభాగ్యము 5 శోభనము 6 అతిగండము 7 సుకర్మము 8 ధృతి 9 శూలము 10 గండము 11 వృద్ధి 12 ధ్రువము 13 వ్యాఘాతము 14 హర్షణము 15 వజ్రము 16 సిద్ధి 17 వ్యతీపాత్ 18 వరియాన్ 19 పరిఘ 20 శివము 21 సిద్ధము 22 సాధ్యము 23 శుభము 24 శుభ్రము 25 బ్రహ్మము 26 ఐంద్రము 27 వైధృతి.

## గౌరీ పంచాంగము

ఆదివారము లగాయితు శనివారమువరకు దివారాత్రములు 16 కాలములు కాలము ఒకటికి 1—30 నిమిషములుగా విభజింపబడినది. మంచి కాలమునందు తాము తలబెట్టిన పనులు నెరవేరును. రాహు కాల. గుళిక కాల, వార దుర్ముహూర్త, వర్జ్యఘడియలు విడిచి పెట్టవలెను.

ఇది గౌరీదేవికి చెప్పబడిన పవిత్రమైన పంచాంగము.

## పగటి ముహూర్తములు

| భాగములు | ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| 1 | ఉద్యోగం | అమృతం | రోగం | విషం | ఉద్యో | రోగం | విషం |
| 2 | లాభం | విషం | ఉద్యోగం | అమృ | విషం | జ్వరం | అమృతం |
| 3 | విషం | ఉద్యోగం | జ్వరం | శుభం | జ్వరం | అమృ | జ్వరం |
| 4 | అమృతం | లాభం | లాభం | ఉద్యో | లాభం | కలహ | ఉద్యో |
| 5 | శుభం | జ్వరం | అమృతం | రోగం | అమృ | లాభం | శుభం |
| 6 | ధనం | అమృతం | ఉద్యోగం | శుభం | విషం | శుభం | లాభం |
| 7 | ఆదాయం | ఆదాయం | విషం | ధనము | కలహ | ధనం | ధనం |
| 8 | విషం | ధనం | లాభం | అమృ | జ్వరం | అమృ | లాభం |

## రాత్రి ముహూర్తములు

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | శుభం | రోగం | జ్వరం | లాభం | శుభం | అమృతం | విషం |
| 2 | అమృతం | లాభం | ఉద్యోగం | రోగం | రోగం | జ్వరం | ఉద్యో |
| 3 | జ్వరం | ఉద్యోగం | కలహం | విషం | కలహం | కలహం | శుభం |
| 4 | రోగం | ధనం | లాభం | ఉద్యోగం | లాభం | లాభం | అమృత |
| 5 | కలహం | రోగం | రోగం | జ్వరం | ఉద్యోగం | శుభం | కలహం |
| 6 | లాభం | అమృతం | లాభం | లాభం | జ్వరం | ధనం | రోగం |
| 7 | ఉద్యోగం | విషం | ఉద్యోగం | ధనం | లాభం | అమృతం | అమృత |
| 8 | రోగం | జ్వరం | ధనం | లాభం | ఉద్యోగం | విషం | లాభం |

## యజమాని—సేవకు—అచ్చుబాటు

శ్లో॥ ఈశాఖ్యభాది పరిచారిక నామభాతం సంగుణ్యా వేద గుణితం
గిరిభాగ శేషం, అర్థంత దైవవిపరీత కృతం ఋణస్యా
రాజ్ఞోర్ధిన స్తదివ సేవకనామ భాది

(ముహూర్త సుధాసార సంగ్రహము)

తా॥ అధిపతియొక్క నామనక్షత్రము లగాయితు సేవకుని నామనక్షత్రమువరకు లెక్కించి, ఆసంఖ్యను నాల్గుచే గుణించి, దానిని యేడుచే భాగింపఁగా మిగిలిన సంఖ్య ధనమగుచు మఱియు, సేవకుని నామనక్షత్రము లగాయితు యజమాని నామనక్షత్రము వరకు లెక్కించి, ఆసంఖ్యను నాల్గుచే గుణించి, దానిని యేడుచే భాగింపగా మిగిలిన సంఖ్య ఋణమగును ధనము హెచ్చుగానున్న మేలుకలుగును ఋణ హెచ్చుగానున్న లాభము.

## అర్వణము

శ్లో॥ శీర్షేపంచసుఖార్థ లాభ నిశం। త్రిణ్యాస నేర్ధాపహం పంచర్షం।
హృదయేర్థ ధాన్యమఖిలం దారిద్ర్యమం ఘ్రోశ్చషట్
పృష్ఠేకం తనునాశనం శుభకరం నాభౌతు చత్వారిచ।
గుహ్యేమరణం తథైక మశుభం లింగేవదంతి క్రమాత్॥

(ముహూర్తసుధాసార సంగ్రహము)

రైతునకు పాలికాపునకును, భూఖామందునకు సేద్యగానికిని, పెట్టుబడిపెట్టేవారికి పుచ్చుకొనేవారికిని, గ్రామమునకు—గ్రామములో నివసింప నెంచినవారికిని ఈ అర్ఘ్యణము చూడవచ్చును.

తా॥ నరాకారముగా నొక బొమ్మవ్రాసి, సేవకుని నామనక్షత్రము లగాయితు యజమాని నామనక్షత్రమువరకు యీ క్రింది విధముగా లిఖించి ఫలముల నెఱుంగవలెను. శిరస్సున 5 శుభము, ముఖమున 3 అర్ధనాశనము హృదయమున 5 ధనధాన్యలాభము, పాదముల 6 దరిద్రము, పృష్ఠమున 1 మృత్యువు, నాభియందు 4 సంపద, గుహ్యమున 1 మరణము, లింగమున 1 అశుభము——ఈవిధముగా ఫలముల నెఱుంగవలెను.

## స్వామ్యార్ఘ్యణము

యజమాని నామనక్షత్రరాశి మొదలు, సేవకుని నామనక్షత్రరాశివరకు లెక్కించి, 1, 5, అయినచో బంధురక్షకుఁడు, 3, 7, 11 పోషకుడు, 2, 6, 10 ఉపేక్షకుడు, 4, 8, 12 ఘాతకుడు అని తెలియవలయును. (ముహూర్త ఫల సర్వస్వము)

## దాసీచక్రము

స్త్రీరూపన రాకార చక్రము లిఖించి, దాసీనక్షత్రము మొదలు, యజమాని నక్షత్రమువరకు గణన సేయుఁగా శిరమున 3 లాభము, ముఖమున 3 హాని, తరువాత 2 యజమానికి హాని. మెడయందు 5 పుష్టి, హృదయమున 7 హాని యోని 1 తిరస్కారము, పాదముల 3 + 3 యజమానికి ధనలాభము.

సేవకుడు యజమానివద్దకు పోయినపుడు సేవకుని నక్షత్రము మొదలు యజమాని నక్షత్రమువరకును, యజమాని సేవకునివద్దకు

పోయినపుడు యజమాని నక్షత్రము మొదలు సేవకుని నక్షత్రమువర కును లెక్కించి ఫలము చూడవలెను. (ము. ఫ. స.)

ద్రవ్య ప్రయోగమునకు

శ్రవణ, ధనిష్ఠ, శతభిష, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, రేవతి, అశ్విని, పునర్వసు, మృగశిర, పుష్యమి, నక్షత్రములయందు తారాబలము చూచి ద్రవ్యము నిచ్చుట శుభకరము.

(జ్యోతిషరత్నాకరము)

విత్తనములు కట్టుటకు

శ్లో॥ మూలానురాధ రేవత్యాం । మఖా స్వాతి త్రియుత్తరా ।
పుష్యవిష్ణు విశాఖాయ । సర్వబీజానవాపయేత్ ॥

(జ్యోతిషఫలగ్రంథం)

తా॥ మూల, అనూరాధ, రేవతి, స్వాతి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, పుష్యమి, శ్రవణము, విశాఖ, యీ నక్షత్రములందు విత్తనములు కట్టుట మంచిది.

గింజల రాసి కొలుచుటకు

శ్లో॥ బుధాత్రి భాగాష్టమ భూమిపుత్రే । రవిర్దశం షోడశరాత్రినాథే।
శనైశ్చరం వింశతి భాగహారే। సభాగహారే గురుశుక్రవారమ్॥

తా॥ బుధవారము మూడు భాగములును, మంగళవారము 8 భాగములును, ఆదివారము 10 భాగములును, సోమవారము 16 భాగములును, శనివారము 20 భాగములును, గింజలు రాసిని హరించును. కావున గురు శుక్రవారములందు రాశిని కొలువవలయును.

ఋణము చేయుటకు

శ్లో॥ మృదు పుష్యాశ్వినీచైవ విశాఖ శ్రవణత్రయం
పునర్వసౌచశంసంతి ధనాదీనిధి వర్తనం

# వ్యవసాయ ముహూర్తదర్పణము

ఋణో భ్రామేన శ్రీష్ణా యాన్న దేయంబుధ వాసరే
త్రికోణాష్టమ శుద్ధిస్తే చరలగ్నే శుభేదినే॥

(ముహూర్త సుధాసారసంగ్రహము)

తా॥ స్వాతి, పుష్యమి, అశ్విని, విశాఖ, శ్రవణము, ధనిష్ట, శతభిషము, పునర్వసు ఈనక్షత్రములయందు. రవి, సోమ, గురు, శుక్ర, శనివారములయందు. 5, 8, 9 ఈస్థానములలో పాపగ్రహములులేని లగ్నములయందు ఋణము చేసినచో త్వరగా తీరిపోవును.

## భూమిక్రయ విక్రయములకు

నందపూర్ణతిథులుగల, గురు శుక్రవారములు, మూల, మృగశిర, పుబ్బ, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, ఆశ్లేష, మఖ, రేవతి, విశాఖ, అనూరాధ, పునర్వసు నక్షత్రములందు భూములను కొనుటయు, అమ్ముటయు శుభకరము.

## భూ సం పా ద న

భూసంపాదనకు, 2, 3, 5, 7, 10, 11, 13, 15, తిథులును, ఆది, మంగళ, బుధ, గురు, శుక్ర, శనివారములును, అశ్విని మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తరాత్రయము, హస్త, చిత్త, స్వాతి, మూల, ఆశ్లేష, శ్రవణ, ధనిష్ట, శతభిషము, రేవతి, ఈనక్షత్రములును, వృషభ, మిధున, కన్యా, కర్కాటక, తులా, ధనుర్మీన లగ్నములును, లగ్నమునందు కుజుడు బలయుక్తముగా నున్నపుడును, కేంద్ర, త్రికోణముల కుజుడు, స్వక్షేత్ర, మూలత్రికోణ, ఉచ్చ మిత్రక్షేత్రములనుండగాను శుభము.

2, 8, 12, స్థానముల కుజుడుండుట అశుభము. తారాబలము చూచుట శ్రేయస్కరము. (మూ ఫ స)

### ఏరు పూతకు

శ్లో॥ రేవత్యుత్తర రోహిణీ కరగురౌ ధిష్ణ్యేతు మూలేందుభిః ।
వాయుర్వాసవ అశ్వినీ భృగుగురౌ సౌమ్యేందు వారోదయే।
వృక్షచ్ఛేదన బీజవాపన హల ప్రారంభ కార్యశ్శుభే।
కన్యా కర్కి మిథునే మీనమకరే సంపూర్ణ ధాత్రేఫలం ॥

ముహూర్తాంశము.

తా॥ రేవతి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రోహిణి, హస్త, పుష్యమి, మూల, మృగశిర, స్వాతి, జ్యేష్ఠ, అశ్విని, నక్షత్రములందును, గురు, శుక్ర, సోమ, బుధవారములందును, కన్య, కర్కాటక, మిథున, మీన, మకర, లగ్నములందును, ఏరుపూసిన బాగుగా ఫలించును. ఈ ముహూర్తములందు ఏరువాక, వృక్షచ్ఛేదన, బీజావాపన, కార్యములు శుభప్రదములు.

### పశుప్రవేశమునకు

శ్లో॥ పూర్వాత్రయో యామ్య కరాది మైత్రే
మఘోరగార్ద్రాశ్విల దస్రచంద్రే
నందాచ భద్రాహరిచాప యుక్తో
పశుప్రవేశో శుభగోహి మార్గః ॥ (ముహూర్తాంశము)

తా॥ నంద, భద్రతిథులయందును, సింహధనుర్లగ్నములందును భరణి, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, మఖ, ఆశ్లేష, ఆర్ద్ర, అశ్విని, పూర్వాత్రయ నక్షత్రములందును, పశువులు పశుశాలలో ప్రవేశించుట శుభకరము.

### పశువులను కట్టుటకు

శ్లో॥ పూర్వాభాద్ర పదారుద్రా । మృగమూలజలగ్నయో ।
రవిజీవశివా వారం ప్రశస్తం పశు బంధనమ్ ॥

(ముహూర్తాంశము)

తా॥ ఆది, సోమ, గురువారములందును, ఆర్ద్ర, మృగశిర, మూల, పూర్వాభాద్ర, కృత్తికా నక్షత్రములందును, పశువులను కట్టుట శుభకరము.

మహిషములను కట్టుటకు

శ్లో॥ కాలవ్యాళహరిత్వష్ట్రి స్థిరభేషు శనిర్ధినే
అమావాస్యాష్టమీ షష్టి ప్రశస్తం మహిషబంధనమ్॥

(ముహూర్తాంశము)

తా॥ భరణి, ఆశ్రేష, శ్రవణము, చిత్తా నక్షత్రములందును, శనివారమునాడును, అమావాస్య, అష్టమి, షష్టి తిథులయందును మహిషములను కట్టవచ్చును.

పశువులను కొనుటకు వెళ్ళుటకు

పశువులను కొనుటకు ప్రయాణమై వెళ్ళుటకు భరణి, ఆరుద్ర, కృత్తిక, అనూరాధ, మూల, మఖ, స్వాతి, పునర్వసు, చిత్త, మృగశిర, ఈనక్షత్రములును, మంగళ, ఆది, శనివారములును శుభకరములు. (జ్యోతిష రత్నాకరము)

పశువుల క్రయమునకు

శ్లో॥ స్వాతీమూల విశాఖాసు రేవత్యాం। శ్రవణేతథామైత్రే భవారుణం
శ్రేష్ఠం పశుక్రయణముచ్యతే ॥

(ముహూర్త సుధాసారసంగ్రహము)

తా॥ స్వాతి, మూల, విశాఖ, రేవతి, శ్రవణము, జ్యేష్ఠ, ధనిష్ట ఈనక్షత్రములందు పశువులను కొనుట శుభప్రదము.

పశువులను విక్రయించుటకు

శ్లో॥ పూర్వత్రయ ధనిష్టేంద్ర । సౌమ్యపౌష్ణ విశాఖయోః

ఆశ్లేషాయ సుఖాశ్వినస్య । గోయాత్రవిజయంభవేత్ ॥

(ముహూర్తాంశము)

తా॥ ధనిష్ఠ, జ్యేష్ఠ, మృగశిర, రేవతి, విశాఖ, ఆశ్లేష, మఖ, అశ్విని, పూర్వాత్రయ ఈనక్షత్రములందు పశువులను అమ్మినవారికిని, కొన్నవారికిని శుభకరము.

## గోవులకు దాయికట్టుటకు - చల్లస్థంభము పాతుటకు

శ్లో॥ రేవత్యశ్విని పుష్యపూర్వశశిమూల శ్లేషు చేజ్యశుక్రార్కానాం
యదివాసరేషు శుభదం గోపాదబంధం తదా
తద్వారేషు హయాదితీందుగురు చిత్రాంతార్క మైత్రేషు
చెన్మం ధన్యాశ్చక్యతం శుభం శనిగృహే సంస్థాపనం సర్వదా॥

(ముహూర్త సుధాసారసంగ్రహము)

తా॥ రేవతి, అశ్విని, పుష్యమి, పూఫ, మృగశిర, మూల, ఈ నక్షత్రములు, ఆది, గురు, శుక్రవారములు క్రొత్తగా ఆవులకు దాయి కట్టుటకు శుభకరములైనవి.

ఆది, గురు, శుక్రవారములు. అశ్విని, పునర్వసు, మృగశిర, పుష్యమి, రేవతి, హస్త, అనూరాధ, ఈ నక్షత్రములు, మకర, కుంభ లగ్నములు చల్లచేయు స్థంభము పాతుటకు శుభప్రదము లైనవి.

## పశుశాల నిర్మాణమునకు

శ్లో॥ తిష్యే దేవగురోచ్ఛ వాసరయుతే। గోంశేచ లగ్నేవృషే
తస్మిన్ శైచె స్మృగ చోరబాధ।రహితం గోష్ఠం గవాంసౌఖ్యదం॥

(దైవజ్ఞ కర్ణామృతము)

తా॥ గురువారముతో గూడిన పుష్యమి నక్షత్రమునందు వృషభ

లగ్నమందైనను, వృషభాంశయందైనను. పశుశాల నిర్మించిన-చో మృగ, చోర, బాధలులేక పశువులు సుఖముగా నుండును.

గిత్తలను క్రొత్తగా నలుపుటకు

శ్లో॥ చేజ్జీవారుణ వారయోర్వ్య హణియోగ్యావర్క్యా బ్రహ్మేంద్రయో
మ్యాద్యంత్యాదితిభేషు । నవ్యవృషభస్కంధేషుయుగ్మంఘుకేశీ ॥

(దైవజ్ఞకర్ణామృతము)

తా॥ అశ్విని, భరణి, రోహిణి. పునర్వసు, హస్త, విశాఖ, జ్యేష్ట, శతభిష, రేవతి ఈనక్షత్రములందు, రవి, గురు వారములందు, గిత్తలను క్రొత్తగా మన్నవచ్చును.

గేదె పోతులను నలుపుటకు

శ్లో॥ కాలత్వష్ట్ర హరిస్థిరాహిషు శనేర్వారేభంచాష్టమీ
రిక్తామానునవంచ యుగ్యఘటనం, పుకమాంహిమస్కంధయోః ॥

(దైవజ్ఞకర్ణామృతము)

తా॥ 8, 4, 9, 14, ఈ తిథులయందును, శనివారమునందును, భరణి, రోహిణి, చిత్త, శ్రవణము, ఉత్తర, ఉత్తరాభాద్ర, ఉత్తరాషాఢ, ఆశ్లేష, ఈనక్షత్రములందును దున్నపోతులకు దుక్కి మప్పుట మంచిది.

క్రొత్తభూమిలో పని ప్రారంభమునకు

అశ్విని, రోహిణి, విశాఖ, ఉత్తరాత్రయ, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, మూల, ధనిష్ట, రేవతి ఈనక్షత్రములందు ఆది, మంగళ, బుధ, శుక్రవారములందు 2, 3, 5, 7, 10, 11 ఈ తిథులయందు క్రొత్తభూమిలో పని ప్రారంభమునకు ప్రశస్తము.

(దైవజ్ఞా దర్శకము)

## హాలచక్రము

శ్లో॥ న్యాచ్చక్రం హలానామకం సమచతుష్కోణం లిఖేచ్చేత్క్రమా
దీశాన్యాం రవిముక్తభాది విలిఖేద్ధిష్ణాని దిక్ష్వష్టసు
గంగాగాణాగి మాగురుశ్చ సహితం జ్ఞేయంమహా దిక్షుభం
దద్యాత్పూర్ణ ఫలం విదిక్షు విఫలం భూమిప్రవేశే కృషౌ ॥

(కాలామృతము)

తా॥ సమచతుష్కోణమగు హాలచక్రమును వ్రాసి దానిలో తత్కాలమున సూర్యుడుండి విడిచిన నక్షత్రము ప్రారంభముగ యీశాన్యము మొదలు యెనిమిది దిక్కులందును క్రమముగా 3, 3, 3, 5, 3, 5, 3, 2, ఈ సంఖ్యల ప్రకారము 27 నక్షత్రములను వ్రాయగా, తూర్పు, దక్షిణ, పశ్చిమ, ఉత్తర దిక్కులందున్న నక్షత్రములందు వ్యవసాయము చేయుటకు, పొలమునఁ బ్రవేశించినచో; సంపూర్ణ ఫలంబులను, ఈశాన్య, ఆగ్నేయ, నైరుతి, వాయువ్య మూలలందున్న నక్షత్రములందు బ్రవేశించినచో నిష్ఫలంబును కలుగును.

## తిథి వార నక్షత్రఫలము

శ్లో॥ మైత్రార్కత్రయ రోహిణీ వసుమఘా దస్రోత్తరాంత్యాసురే
ష్వార్యారజ్ఞక వేర్ది నేషు శుభదో మధ్యస్తుచాంద్రేదినే
త్యక్త్వారిక్తదినాదిదగ్ధదివసాన్ దర్శావమా వైధృతి
వ్యాఘాత వ్యతిపాత విష్టిదివసాన్ శేషాః కృషౌశోభనాః॥

తా॥ అనూరాధ, హస్త, చిత్త, స్వాతి, రోహిణి, ధనిష్టా, మఖ, అశ్విని, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రేవతి, మూల, ఈ 13 నక్షత్రములును, మంగళ, బుధ, గురు, శుక్రవారంబులును, కృషి ప్రారంభమునకు శుభకరములు. సోమవారము మధ్యమము.

రి_క్తతిథులును, దగ్ధతిథులును, ప్రతిపత్తును, అమావాస్యయు, పూర్వో_క్తమైన, అవమయు (మూడు తిథులుగూడిన వారము) వైధృతి, వ్యాఘాత, వ్యతీపాత్, యోగములును భద్రకరణమును కృషికి పనికి రావు. మిగిలినవి పనికివచ్చును.

## వి_త్తనములు చల్లుటకు బీజఫణి చక్రము

శ్లో॥ బిందునామపి స_ప్తవింశతి మృజుంసంలిఖ్యబిందు్వగ్రతో
రేఖాభి_స్తి సృభిః పునఃపున రధశ్చోర్ధ్వంచ తన్మూలతః
తస్యాగ్రేతులిఖే ద్విలోమత ఇహాస్వర్భానుభాద్గణ్యాతే
నక్షత్రే ష్వపి నిత్యచక్రచలనా ద్రాహోర్గగత్యాదివా ॥
(కాలామృతము)

తా॥ ఒకవరుస 27 బిందువులనగా ం ఇటువంటి చిహ్నములు వ్రాసి, అందు మొదటనున్న మూడు బిందువులందు మూడు రేఖలను ప్రారంభించి, 4 వ బిందువును విడిచి, ముందువ్రాసియున్న రేఖల 5, 6, 7 బిందువులతో గలిపి, 8 వ బిందువును విడిచి, 9, 10, 10 ఈ బిందువులతో ముందువ్రాసిన రేఖలను గలిపి, 12వ బిందువును విడిచి, 13, 14, 15 ఈబిందువులతో ముందువ్రాసిన రేఖలను గలిపి, 16 వ బిందువును విడిచి, 17, 18, 19 ఈబిందువులతో ముందువ్రాసిన రేఖలను గలిపి, 20 వ బిందువు విడిచి, 21, 22, 23 బిందువులతో ముందువ్రాసిన రేఖలను గలిపి, 24 వ బిందువును విడిచి, 25, 26, 27 బిందువులతో ముందువ్రాసిన రేఖలను గలిపినచో బీజఫలచక్రమగును. చక్రములోని మొదటి బిందువునందు రాహువున్న నక్షత్రము వ్రాసి రవి మొదలు తలక్రిందుగ 27 నక్షత్రములను 27 బిందువులందును వ్రాయవలయును.

## చ క్ర ఫ ల ము

శ్లో॥ చక్రంబీజ ఫణింవిలిఖ్య ఫణిభా_త్తన్మూర్ధ్నినాశంత్రయం

కంఠే త్రీణ్యపి కజ్జలంచ జఠరే భాని క్రమాద్ద్వాదశ
దద్యుశ్చాన్న సమృద్ధి మత్ర కృషితో నిస్తండులత్వం త్రయం
పుచ్ఛే త్వీతిభయం బహిస్తు షడపి ప్రాగ్బీజసంస్థాపనే॥
(కాలామృతము)

తా॥ బీజావాపనవిషయమై పై ప్రకారము వ్రాసిన నక్షత్రములు చక్రశిరమున బొందియున్న 3 ను హాని, కంఠమందున్న 3 ను కృష్ణ ధాన్యమును, కుక్షిలోనున్న 12 ను అన్నసమృద్ధిని తోఁకయందున్న 3 ను తండులలాభమును, మూఁడేసి బిందువులనడుమ విడువబడిన 6 బిందువులలోనున్న నక్షత్రములు పైరులకు మిడుతలు మొదలగు యీతిబాధలును, కలుఁగఁజేయును.

## బీజావాపన మంత్రవిధి

శ్లో॥ జ్యేష్ఠాయా మథమూలభే శుభగృహే లగ్నే విశుద్ధేష్టమే
సంపూజ్యాఖిలదేవతాః కృషిభువం సస్పృశ్యసన్మంగళైః
"ఓం విశ్వే మహితే నమోభగవతీ" త్యేతేవ సంమంత్రితం
బీజావాపన మాద్యమేవ ఫలదం, కుర్యాత్సుతారాసువా॥
(కాలామృతము)

తా॥ అత్యంతముఖ్యములగు జ్యేష్ఠా మూలా నక్షత్రములందైనను, శుభప్రద నక్షత్రములందైనను, సప్తమశుద్ధిగల శుభగ్రహ సంబంధ లగ్నములందైనను, సకలదేవతలను పూజించి, "ఓం విశ్వే మహితే నమోభగవతి" అను మంత్రముచేత కృషిభూమిని అభిమంత్రించి, మంగళవాద్యములతో స్పృశించి ప్రథమ బీజావాపనము చేయుట శుభకరము.

## విత్తనములు చల్లుటకు తిథివార నక్షత్ర ఫలములు

శ్లో॥ రిక్తాపర్వవిమప్రదోష రహితే వారే శుభానాంగృహే

క్షిప్రస్వాతిమృదుధ్రువాసురమఖాపిష్ణ్యాభియోగ్యేషు
బీజావాపన మాద్యమేవ ఫలదం స్యాత్పూర్వసస్యేపరే
యద్వర్ణగ్రహవాసరేషు యదివాతద్వర్ణ బీజం వపేత్॥
(కాలామృతము)

తా॥ రిక్తతిథులును, పంచపర్వంబులును, త్యాజ్యఘటికలును, ప్రదోషకాలంబులు, విడిచి, శుభతిథులయందు శుభగ్రహసంబంధము లగు వారములయందును, అశ్విని, హస్త, పుష్య నక్షత్రములయందును, చిత్త, రేవతి, మృగశిర, అనూరాధలయందును, రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్రలయందును, స్వాతి, మూల, మఖ, శ్రవణ, ధనిష్ఠ, శతభిష నక్షత్రములందును అనగా క్షిప్ర, మృదు, స్థిర సంజ్ఞలుగల నక్షత్రములందు విత్తనములు చల్లిన శుభకరము. ఏవర్ణ విత్తనములు చల్లుట కావర్ణగల గ్రహముల వారములు శుభకరము లని, ఒకపక్షమునఁ జెప్పఁబడెను. 2, 5, 7, 11, 13, 15 యీతిథులు బీజకర్మకు ప్రశస్తములు.

విత్తనములు చల్లుటకు లగ్న ఫలములు

శ్లో॥ మేషే చేత్పశునాశనం, బహుఫలం చేత్కర్కటే చేద్ధటే
కుర్యాత్ప్రాణహృతించసస్యహరణం, లగ్నే మృగేసర్వదా
సింహే చోరభయం ఘటేబహుభయం బీజాప్తిరాద్యాశుభా
కన్యాగోఝషయుగ్మవృశ్చికధనుష్వేతేషుధాన్యప్రదా॥
(కాలామృతము)

తా॥ విత్తనములు చల్లుట కారంభించిన, మేషలగ్నమునందు పశునాశనము, కర్కాటకము బహుఫలము, తుల ప్రాణహాని, మకరము సస్యహాని, సింహము చోరభయము, కుంభము అధికభీతి, కన్యా, వృషభ, మీన, మిథున, వృశ్చిక, ధనుర్లగ్నములందు ధాన్యసమృద్ధియు, శుభప్రదమును కలుగును.

వివిధవిత్తనములు చల్లుటకు వార లగ్న ఫలములు

శ్లో॥ అర్కో సమయే సూర్యస్యవారే సర్వబీజాని వాపయేత్
సోమవారే మిథునలగ్నే । జల పుష్పాంకురాన్న్యసేత్॥
(ముహూర్తదర్పణము)

తా॥ ఆదివారమున సింహలగ్నమునందు సర్వబీజములు చల్లవచ్చును. సోమవారమున మిథునలగ్నమునందు రాజనపు విత్తనములు చల్లవచ్చును.

శ్లో॥ కుజస్యవారే లగ్నే । కోద్రవాన్వాపయేద్బుధః
బుధవారే సౌమ్యలగ్నే । క్రముకస్థాపనం వనం॥
(ముహూర్తదర్పణము)

తా॥ మంగళవారమున మేషవృశ్చికములయందు, కొఱ్ఱధాన్యములను, బుధవారమున మిధునకన్యలయందు పోకచెట్లు పెట్టెడి తోటను స్థాపించవలెను.,

శ్లో॥ స్థాపయేత్ఫలవృక్షాంశ్చ । తల్లగ్నే దివసే గురోః
శుక్రవారే తదుద ఏత్కుసుమంతరం॥
(ముహూర్తదర్పణము)

తా॥ గురువారమున ధనుర్మీనములందు మామిడి మొదలగు ఫలవృక్షములు నాటవలెను. శుక్రవారమున తులా వృషభములందు మల్లె మొదలగు పూలచెట్లు నాటవలెను.

శ్లో॥ మందశ్యలగ్నే మందాహే । కృష్ణధాన్యానివాపయేత్
(ముహూర్తదర్పణము)

తా॥ శనివారమున మకర కుంభములయందు నువ్వులు మొదలగునవి చల్లవలెను.

సెనగ, గోధుమ, కంది విత్తనములు చల్లుటకు

శ్లో॥ మూలాత్ర్యుత్తర నైష్ణవేంద్వ దితి సస్వాంత్యాజమైత్రానిలే
ష్వేవంకర్కి ధనుర్ఘట స్థిర గృహేంస్యాహుశ్చ్వవారే శుభే॥
(దైవజ్ఞ కర్ణామృతము)

తా॥ మూల, శ్రవణము, మృగశిర, పునర్వసు, ధనిష్ట, రేవతి, రోహిణి, అనూరాధ, స్వాతి, ఉత్తరాత్రయ, ఈ నక్షత్రములందును, కర్కాటక, ధనుస్సు, తుల, వృషభము, సింహము, వృశ్చికము, కుంభము, ఈ లగ్నములందును, బుధ, గురు, శుక్ర వారములందును సెనగ, గోధుమ, కంది విత్తనములు చల్లుట ఫలప్రదము.

సకల ఫలవృక్షములు నాటుటకు

శ్లో॥ రేవత్యుత్తర రోహిణీ గురు కరాది త్యేషు నక్తంచరే
వాయౌవారుణవాజినోశ్చశశి జేంద్వా రేషువా రేషుచ
వృక్షస్థాపన బీజవాపన హలప్రారంభ కార్యేశుభం
కన్యాకర్కియుగోక్ష మీనమకరే సంపూర్ణ ధాత్రీఫలం॥
(దైవజ్ఞ కర్ణామృతము)

తా॥ శుభతిధులయందు, బుధ, గురు, సోమవారములందు, రోహిణి, అశ్విని, పుష్యమి, పునర్వసు, హస్త, మూల, స్వాతి, శతభిషము, ఉత్తరాత్రయము, రేవతి, ఈ నక్షత్రములయందు, కన్యా, కర్కాటక, వృషభ, మిధున, మీన, మకరలగ్నములయందు సమస్త ఫలవృక్షములు నాటవచ్చును. విధ విధ విత్తనములు చల్లవచ్చును. హలకర్మారంభము చేయవచ్చును. భూమి సంపూర్ణ ఫలప్రదమగును.

## వృక్షచ్ఛేదనమునకు

తా॥ రోహిణి, మృగశిర, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, మూల, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, శతభిషము, ఈనక్షత్రములయందును, సోమ, బుధ, గురువారములందును, 2, 3, 5, 7, 10, 11, 13 ఈ తిథులయందును, మేష, వృషభ, కర్కాటక, కన్య, తుల, మకరము లందును, ద్వాతీయశుద్ధిగనుండగా వృక్షములను ఛేదించుట శుభకరము.

(జ్యోతిఫలరత్నాకరము)

## సర్వతోటలు వేయుటకు

హస్త, చిత్త, విశాఖ, మూల, శతభిషము, స్వాతి, ఉత్తర, ఉత్తరాభాద్ర, ఉత్తరాషాఢ, రోహిణి, జ్యేష్ఠ, అశ్విని, పునర్వసు, పుష్యమి, అనూరాధ, కృత్తిక, పుబ్బ, పుర్వాషాఢ, పూర్వాభాద్ర ఈనక్షత్రములందు గురు, సోమ, బుధ, శుక్రవారములందు గండరిక్త తిథులయందు సమస్తమైనతోటలు వేయవచ్చును.

(ముహూర్తాంశము)

## చెఱుకుతోట వేయుటకు

శ్లో॥ వాక్పతీచాశ్వినిహస్త । మృగమైత్రనిశాచరమ్
యుతుస్థాప్యంశుభావహామ్॥  (ముహూర్తాంశము)

తా॥ పుష్యమి, అశ్విని, హస్త, మృగశిర, అనూరాధ, మూల, ఈనక్షత్రములందు చెఱుకుతోటలువేసిన ఫలవంతములగును.

## రేగు, అరటి, పనస, మామిడితోటలు వేయుటకు

శ్లో॥ పుష్యోత్తరాభాద్ర మఖాశ్విపౌష్ణ ।
మైత్రార్యభేషుక్రిమికీటవృషాంగనాసు
పూర్ణాజయా సుభృగువిద్గురువాసరేషు ।
సంస్థాపనం కదళిచూతి పనస బదరీ వనాదికార్యం॥

(ముహూర్తసుధాసారసంగ్రహము)

తా॥ పుష్యమి, ఉత్తరాభాద్ర, మఖ, అశ్విని, రేవతి, అనూరాధ, ఉత్తర, ఈనక్షత్రములందు, మేష, వృశ్చిక, వృషభ, కన్యా లగ్నములందును, 3, 5, 7, 10, 12, 15 ఈ తిధులయందునను, బుధ, గురు, శుక్ర వారములందును, రేగు, అరటి, పనస, మామిడివనములు వేసిన చక్కగా ఫలించును.

### వంగతోట వేయుటకు

శ్లో॥ భరణి శ్రవణం స్వాతి । మేఖలాస్సు రేవతి
వసుష్ఠంగిరిశో భేషు । వార్తాకి స్థాపనం శుభమ్॥
(ముహూర్తాంశము)

తా॥ భరణి, శ్రవణము, స్వాతి, మఖ, మూల, రేవతి, ధనిష్ట, అశ్విని, ఈ నక్షత్రములయందు వంగనారు నాటినచో మంచిఫలితము కలుగును.

### అంట్లు కట్టుటకు

శ్లో॥ హస్తాశ్వపుష్యోత్తరరోహిణీషు । చిత్తానురాధామృగ రేవతీషు
స్వాతౌధనిష్ఠాచమఖాచమూలా । బీజోత్తరుత్కృష్టఫలంవదంతి॥
(ముహూర్తాంశము)

తా॥ హస్త, అశ్విని, పుష్య, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రోహిణి, చిత్త, అనూరాధ, మృగశిర, రేవతి, స్వాతి, ధనిష్ట, మఖ, మూల, ఈనక్షత్రములందు అంట్లుకట్టినచో బాగుగాఫలించును.

### పాదులు పెట్టుటకు

శ్లో॥ స్వాతి త్రిష్వాశ్విని వారుణేషు। మూలావిశాఖాయ మృదుధ్రువేషు
లతౌష దీపాది సర్వోప వేషు। శుభ ప్రయుక్తం మునయోవదంతి॥
(ముహూర్తాంశము)

తా॥ స్వాతి, పుష్యమి, అశ్విని, శతభిషం, మూల, విశాఖ, ఈనక్షత్రములందుగా సమస్తమైన తీగెలు గల పాదులుపెట్టిన బాగుగా కాయును.

చెట్లు పాతుటకు

శ్లో॥ రేవత్యుత్తర రోహిణీ గురుకరాదిత్యేషు నక్తం చ రేవాయథా
వాయుశ్చాశ్విని సౌమ్య శశిజేజ్య భృగోషు వారేషుచేత్,
వృక్షస్థాపన బీజవాప హలప్రారంభ కార్యేశుభం
కన్యాకర్కట యుగ్మ మీనధనుషే స్సంపూర్ణ ధాత్రీఫలమ్ ॥
(ముహూర్తసుధాసార సంగ్రహము)

తా॥ రేవతి, ఉత్తర, రోహిణి, పుష్య, హస్త, పునర్వసు, మూల, స్వాతి, శతభిషం, అశ్విని, యీ నక్షత్రములందును, సోమ, బుధ, గురు, శుక్రవారములందును, కన్య, కర్కాటక, మిధున, మీన, ధనుస్సు, వృషభ లగ్నములందును, శుభతిదులందును, సమస్తమైన చెట్లులు నాటవచ్చును. సమస్త బీజములు చల్లుటకును, హలకర్మ ప్రారంభమునకును శుభప్రదములు.

పొగాకుతోటలు–గంజాయితోటలు వేయుటకు

శ్లో॥ విశాఖరేగురా రాద్రే । తుసింగేకాల వాతయోః
గురుభౌమార్క వారేషు । స్థాప్యంచే ధ్ధామ పత్రకమ్ ॥
మూలోత్తరాదిశిశ్విక్ర । పౌష్ణమైత్ర కరేందుషు ।
భౌమార్క గురువారేషు । స్థాప్యాంగాంధారికస్యచా ॥
(ముహూర్తసుధాసార సంగ్రహము)

తా॥ మృగశిర, పుష్యమి, ఆరుద్ర, అశ్విని, భరణి, స్వాతి, యీనక్షత్రములందు శుభతిథులయందు, ఆది, మంగళ, గురువారము లందు పొగాకుతోటలు వేసినచో చక్కగా ఫలించును. ఉత్తర, పున

ర్వాసు, జ్యేష్ఠ, రేవతి, అనూరాధ, హస్త, మృగశిర ఈనక్షత్రము లందు, ఆది, మంగళ, గురువారములందు గింజాయితోటలు వేయుట శుభకరము.

ఉల్లి, కంద, తోటలు వేయుటకు

శ్లో॥ రేవత్యశ్వినిమైత్రవాయువరుణా।
దిత్యేంద్రవిష్ణిజ్యమూలాంత్య ర్క్యేందుషు ।
భానుసోమగురువారే ష్వేవవృద్ధి ప్రదం।
పూర్ణయాంమృగమీనకీటకధనుః।
కుంభేషుచార్కోదయే స్థాప్యం।
గృంజనబీజమాహురితివాశిష్టాత్రిగర్గాదయః ॥

(ముహూర్త సుధాసారసంగ్రహము)

తా॥ రేవతి, అశ్విని, అనూరాధ, స్వాతి, శతభిషం, పునర్వాసు, జ్యేష్ఠ, శ్రవణం, పుష్యమి, మూల, హస్త, ఉత్తర, మృగశిర, యీ నక్షత్రములయందు. ఆది, సోమ, బుధ, గురు, శుక్రవారములందు, సూర్యోదయ కాలమునందు, ఉల్లితోట, కందితోటలు పైరుపెట్ట వలెను.

ప్రత్తిపైరునకు

శ్లో॥ కార్పాసస్యచబీజవాపనవిధి గుర్వర్కవారేంగనా
కర్క్యాంతేష్వదితియ్యమార్కగురువాతాద్యంత్యదైత్యేందుషు॥

(ముహూర్త సుధాసారసంగ్రహము)

తా॥ పునర్వాసు, భరణి, హస్త, పుష్యమి, స్వాతి, అశ్విని, రేవతి, మూల, ఈనక్షత్రములును, 2, 3, 5, 7, 10, 13, యీతిథు లును, సోమ, బుధ, గురు, శుక్రవారములును, గురు బుధులు కేంద్ర ములయందుండగా ప్రత్తిపైరు పెట్టుటమేలు.

## ఖర్జూర, పోక, కొబ్బరితోటలు వేయుటకు

శ్లో॥ వాక్పుష్యాశ్వినీహస్త । మృగమైత్రాసు రేషుచ ।
ఖర్జూరనారికేళక్రముకతరు । సంస్థాపనం శుభమ్ ।
పూర్ణాఖ్యపయతిథ్యేషు । శుభవారే శుభోదయే ॥

(ముహూర్త సుధాసారసంగ్రహము)

తా॥ పుష్యమి, అశ్విని, హస్త, మృగశిర, అనూరాధ, మూల, ఈనక్షత్రములందును, బుధ, గురు, శుక్రవారములందును, స్థిరలగ్నములందును, శుభతిథులయందును, ఖర్జూర, పోక, కొబ్బరితోటలు వేసినచో ఫలప్రదములగును.

## సస్యములు చిత్తపట్టకుండుటకు

శ్లో॥ యక్షరాక్షసపక్షిణా । కీటకైః క్రిమికీటకైః
సర్వపీడా వినాశాయ । యాజ్ఞా శుద్ధివిభీషణా ॥

(ముహూర్తాంశము)

తా॥ పై శ్లోకమును ఒక తాటియాకుపైన వ్రాసి, చక్రముగా చుట్టి దానికి ధూపము వేసి, చేనుమధ్య దానినికట్టినచో చిత్తపట్టనేరదు.

## బెదురు కొయ్యకు

సీ॥ ఖరఫణి చంద్రుల ♦ కణుజులురారావు
బ్రహ్మేంద్ర మూలల ♦ పందిరాదు
అదితి వాసవనిల ♦ రావెనుబోతులు
పుష్యచిత్తల । పులులురావు
శ్రవణ విశాఖల ♦ చేరవు మృగములు
మఖయందు చోరులు ♦ మరియురాదు

పూర్వభాద్రయుగంబున ♦ బొట్లును దుప్పులు
భరణియందు పక్షులు ♦ సారపోవు
తే॥ స్థిరములగు లగ్నములను వా ♦ సరములందు
కొఱమ ముసిడి సైన రెమ్మిక ♦ కొయ్యగుంపున
నొక్క కర్రెలను ఖండించి ♦ యొనర చేను
సమాశ పాతిన జంతు జా ♦ లములు రావు॥

(జ్యోతిషఫలగ్రంథము)

✝ తా॥ హస్త, ఆశ్లేష, మృగశిర, ఈనక్షత్రములందు కణుజులును, రోహిణి, మూలలయందు పందులును, పునర్వసు, జ్యేష్ఠ, స్వాతులందు యెలుగుబంట్లును, పుష్యమి, చిత్తలందు పులులును, మఘయందు చోరులును, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్రలయందు, దుప్పులును. భరణియందు పక్షులును, కొఱమ, ముసిడి, రెమ్మ, ఈమూడుజాతులలో యేకట్టెగాని ఒక్క కర్రెను ఖండించి ఆకొయ్యను చేనునడుమ స్థిరలగ్న నక్షత్రవారములందు పాతినచో, పై జంతు సమూహములు రావు.

## చే ల కా పు న కు

శ్లో॥ చిత్రాశ్విని వహ్నినిశాచరేషు । జీవేందుజంభార్గవవాసవానాం
సస్యంచగుప్తిం మృగనాగచోరైః । క్రోడాదికై స్సాధ్వయనాశనంచ
(ఫలగ్రంథము)

తా॥ చిత్త, అశ్విని, ధనిష్ఠ, కృత్తిక, మూల, ఈనక్షత్రములందును, బుధ, గురు, శుక్ర వారములందును, చేనుకాపునకు వెళ్ళినచో ఆచేనునకు అడవిపందులు మొదలగు జంతువులచేతను, గోరింకలు మొదలగు పక్షులచేతను, పాములవలనను, చోరులవలనను భయ ముండనేరదు.

## చే ను పా లి చే యు ట కు

శ్లో॥ ధ్రువధాత్వకరాదిత్య । గురుత్వాష్ట్రీచమూలభే

మైత్రవాయుమఘాపౌష్ణ । గురుశుక్రేవభాస్కరే
జయపూర్ణాతిథిస్సౌఖ । సర్వసస్యానకృంతనమ్ ॥

(ముహూర్తాంశము)

తా॥ అశ్విని, రోహిణి, హస్త, పునర్వసు, పుష్యమి, చిత్త, మూల, అనూరాధ, స్వాతి, మఖ, రేవతి. ఈనక్షత్రములందును, గురు, శుక్ర, ఆదివారములందును. జయ, పూర్ణతిథులయందును చేనుపాలి అంటవచ్చును.

## చేనుకోతకు, కుప్ప వేయుటకు

శ్లో॥ మూలాత్యుత్తరవైష్ణవేందదితివస్వాంత్యాదిమైత్రానిలే
ష్వేవంకర్కిఘనార్ధట స్థిరగృహేష్వాహుశ్చవారేశుభే
బీజావాపనమన్వహంచణకగోధూమాధకానాంశుభం
మూలాత్యుత్తరమైత్రసార్పమఖవిష్ణ్వంత్యేజ్యభేబంధనం॥

(ముహూర్తసుధాసార సంగ్రహము)

తా॥ మూల, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, శ్రవణము, మృగశిర, పునర్వసు, ధనిష్ఠ, రేవతి, రోహిణి, అనూరాధ, స్వాతి, ఈనక్షత్రములయందును. స్థిరలగ్నములందును, బుధ. గురు, శుక్రవారములందును, చేనుకోయవచ్చును. కోసినసస్యములను కుప్పలువేయవచ్చును.

## కుప్పలు నూర్చుటకు

కృత్తిక, మృగశిర, ఆరుద్ర, పుష్యమి, మఖ, హస్త, మూల, శ్రవణము, ధనిష్ఠ ఈనక్షత్రములందు కుప్పలు నూర్చుటమంచిది.

(జ్యోతిషసారసంగ్రహము)

## నూర్చిన గింజలు తెచ్చుటకు

శ్లో॥ మృదుక్షి ప్రాఖ్య బుక్షేషు । శశిభృగ్వీజ్య వాసరే
చంద్రతారాబలేచ స్యాన్న । వ్యధాన్యాగమం శుభమ్ ॥

(ముహూర్త సుధాసారసంగ్రహము)

తా॥ చిత్త, రేవతి, మృగశిర, అనూరాధ, అశ్విని, పుష్య, హస్త ఈ నక్షత్రములయందును, సోమ, గురు, శుక్రవారములయందును, పూర్ణ తిథులయందును, చంద్రతారాబల యుక్తమును చూచి క్రొత్తగింజలు యింటికి తెచ్చుట మంచిది.

## గింజలు పాతరలో పోయుటకు

అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణము, ధనిష్ఠ, శతభిషము, ఉత్తరాభాద్ర, రేవతి, ఈ నక్షత్రములయందును, సోమ, బుధ, గురు, శుక్రవారములందును, వృషభ, మిధున, సింహ, కన్య, వృశ్చిక, ధనుర్మీన లగ్నములందును, ధాన్యస్థాపన చేయుట శుభము.

(దైవజ్ఞా దర్శకము)

## ధాన్యము దంచుటకు

మఖ, పుబ్బ, అనూరాధ, జ్యేష్ఠ, మూల, రేవతి ఈనక్షత్రములయందును, సింహలగ్నమునందును, ధాన్యము దంచుట ఫలప్రదము.

(దైవజ్ఞా దర్శకము)

## క్రొత్త అన్నము తినుటకు

శ్లో॥ తిష్యాదిత్యాశ్వి దైత్యాధిప వసుపరమేష్ట్యంత్య చిత్రా
విశాఖాశ్రిస ప్రాచేతసార్క-శ్వసన పితృనిశాధీశ

పుష్యోత్తరాసు దిత్యాశ్వి త్వాష్ట్రాంత్యే శ్వసాళిషుచ ।
శుభతిథౌ చాష్టమస్థం శశాంకం హిత్వా మందే,
సురౌవా శుభమితి మునయో౽న్నవ్యధాన్యాన్న భుక్తిమ్॥

(ముహూర్తసుధాసార సంగ్రహము)

తా॥ పుష్యమి, పునర్వసు, అశ్వని, మూల, ధనిష్ఠ, రోహిణి, రేవతి, చిత్త, విశాఖ, శ్రవణ, శతభిషము, హస్త, స్వాతి, మఖ, మృగశిర, అనూరాధ, ఉత్తర ఈనక్షత్రములును, 2, 3, 5, 7, 10, 13, ఈ తిథులును, 1, 8, 12 ఈలగ్నములందు అష్టమిచంద్రుఁడు లేకుండ శని, గురువారములందు క్రొత్త అన్నము భుజింపవచ్చును.

## ధాన్యము అమ్ముటకు

రోహిణి, ధనిష్ట, శతభిషము, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, ఈ నక్షత్రములందు గింజలు అమ్ముటమంచిది.

(జ్యోతిషసార సంగ్రహము)

## పాదులనుండి ప్రారంభమున కాయలుకోయుటకు

మంగళ, శుక్రవారములు, పూర్ణిమ, అమావాస్యలు, నవమి, చవితి, తిథులు గ్రహదినములు పనికిరావు. ఈ దినములలో కాయలు కోసిన పాదులు చెడిపోవును. (ముహూర్తఫల సర్వస్వము)

## గానుగ, బండి పూయుటకు

శ్లో॥ అశ్విపౌష్ణానురాధాచ । హస్తాపుష్యమృగ స్తథా
షట్తారమాతలన్నాస్తి । భ్రమణంచ విశేషతః ॥

తా॥ అశ్విని, రేవతి, అనూరాధ, హస్త, పుష్యమి, మృగశిర, ఈనక్షత్రములందు గానుగ, బండి పూయవచ్చును. 2, 3, 5, 7, 10,15

ఈ తిథులును, సోమ, బుధ, గురు, శుక్రవారములును, మేష, కర్కాటక, తుల, మకర, మిథున, కన్య, మీనరాశిలగ్నములను తారాబలము చంద్రబలము సరిపడగా చెఱుకుగానుగయు, మూనగానుగయు, ఎత్తవచ్చును. నూనె, చెఱుకురసము తీయు ప్రారంభించవచ్చును.

(ము. ఫ. స॥)

## ఏతము ఎత్తుటకు

సోమ, బుధ, గురు, శుక్రవారములు. 2, 3, 5. 7, 10, 11, 13, 15, తిథులు శుభకరములు.

## క్రొత్తగింజల రాశి కొలుచుటకు

శ్లో॥ మైత్రార్కేందుమఖోత్తరాత్రయహయత్వష్ట్రాంత్యభాగ్యత్రయ
బహ్మాంగీరసభేషుభద్రజయ పూర్ణాఖ్యతిథౌ చేచ్ఛుభం
గోసింహాంత్యఘటాంగనాయుగ ధనుర్లగ్నేషుభృగ్వార్యయో
ర్వారేపాపగృహేషుపాపఖచరాస్సౌమ్యాశ్శుభేషుస్థితాః
స్వాద్వారస్థితే మూర్తమహూర్తసహితే సేందూదయే వాతథా
ఋక్షత్యాజ్యయుతేషు మానసమయ ప్రాప్తేతులగ్నేయదా
మధ్యేఽభ్రస్యముఖర్క్షతోరణయుతే చేద్ధాన్యరాశేః క్రమా
న్మందంమానమితి బ్రువంతిమునయో తద్వృద్ధిసంప్రాప్తయే॥

(దైవజ్ఞకర్ణామృతము)

తా॥ 2, 3. 5, 7, 8, 10, 12, 13, 15 ఈ తిథులయందును, గురు, శుక్రవారములందును, ఉత్తరాత్రయ, పూర్వాత్రయ, రోహిణి, మృగశిర, పునర్వసు, హస్త, చిత్త, అనూరాధ, రేవతి, అశ్విని, నక్షత్రములందును, వృషభ, మిథున, సింహా, కన్య, ధనుస్సు, కుంభ, మీనలగ్నములందును, శుభప్రదము,

ఆ సుముహూర్తలగ్నమునకు త్రిషడాయవ్యయాష్టమములందు పాపులును, కేంద్రకోణములందు శుభులును, యుండిరేని, శుభకరము. చంద్రోదయముతోనైనను, వారసుముహూర్తములతోనైనను, లగ్నమునకు మధ్యకాలమున యివి వచ్చుసమయమందైనను, అంతరిక్షమందు మఖానక్షత్రము సుధ్యాహ్నమైయుండగా క్రొత్తగింజలరాసులు కొలిచినచో వృద్ధియగునని మహర్షులు చెప్పియున్నారు.

## రాశికొలతకు ప్రత్యేక వారఫలములు

శ్లో॥ బుధస్త్రిభాగం, వసుభాగమర్కోజోరవిర్దశాంశంచశశికళాంశం
శనైశ్చరోవింశతిభాగమాహారే,న్న భాగహారా, గురుభార్గవౌతథా॥
(దైవజ్ఞకర్ణామృతము)

తా॥ బుధవారమందు రాశిని కొలచిన రాశియొక్క మూడవపాలును, మంగళవారమునందు ఎనిమిదవపాలును, ఆదివారమునందు పదియవపాలును, సోమవారమునందు పదహారవపాలును, శనివారమునందు యిరువదియవపాలును రాశిలో క్షీణించును. కావున గురు శుక్రవారములందు కొలుచుట శ్రేష్టమని ఋషులు వచియించిరి.

## వాపీకూపాది వివరములు

శ్లో॥ ద్వారహీనోభవేత్కూపో । ద్వారేణైకేనవాపికా ।
నైకద్వారాపుష్కరిణీ । దీర్ఘాకారాతు దీర్ఘికా ।
కుల్యావిధూతతోయశ్చ । తటాకః పరికీర్తితాః॥
(జలార్గళశాస్త్రము)

తా॥ ద్వారములు లేనిది కూపము, ఒకద్వారముగలది వాపి, అనేక ద్వారములు (నాల్గుద్వారములు) కలది పుష్కరిణి, పొడవుగనుండునది దీర్ఘిక, కాలువల జలప్రవాహములచేత నిండునది తటాకము అని చెప్పుదురు.

## ని ర్మా ణ ఫ ల ము

శ్లో॥ ఏకుర్వంతినరాఃపుణ్యాః । పురేపానీయశాలకమ్ ।
విష్ణునాసహామోదంతే । యావదుహ్యామండలేజలే ॥

(విశ్వకర్మ)

తా॥ వాపి, కూప, తటాకాదులును, దేవాలయములును, నిర్మించిన పుణ్యాత్ములు విష్ణులోకమునందు చిరకాలము నానావిధ సౌఖ్యముల ననుభవింతురు.

## ✝ తటాక కూపారంభ ముహూర్తములు

శ్లో॥ హాస్తేచాంబుప పౌష్ణ కేశవ సాఖా । మిత్రోత్తరా రోహిణీ।
దేవేజ్యేషుచ శుక్రసౌమ్య శశభృద్వాగీశ వారాశ్రితే
రిక్తాఛిద్ర తిథా విహాయ వృషభేనక్రే కులీరే ఘటే
మీనే కూప తటాక కర్మసుగుణ యశ్శుభసూశి శుద్ధేష్టమే ॥

(ముహూర్తసుధాసార సంగ్రహము)

తా॥ హస్త, ధనిష్ట, పుష్యమి, శ్రవణము, మఖ, అనూరాధ, ఉత్తరాషాఢ, రోహిణి, పునర్వసు. ఈనక్షత్రములును, శుక్ర, బుధ, సోమ, గురువారములును, యీపక్షద్వర్గములయందును, 2, 3, 5, 7, 10, 13, ఈతిథులయందును, వృషభ, మకర, కర్కాటక కుంభ, మీన లగ్నములందును, అష్టమ శుద్ధిగల్గినట్టి ముహూర్తమునందు పూర్వాహ్ణమునందు నూతులు, చెఱువులు తవ్వినచో, శాశ్వతముగా జలప్రదములై యుండును.

నాచే రచియింపఁబడిన పంచవాస్తు పారిజాతమునుండి
విశేషాంశములు
✝ యీదిగువ వ్రాయుచున్నాను

1. లగ్నమందు బుధుఁడుగాని, గురుఁడుకాని, కేంద్రములందు చంద్ర శుక్రులుగాని ఉన్నయెడల జలప్రదమగును. లగ్న

ద్వితీయ, తృతీయ, చతుర్థములయందు పాపగ్రహము లుండ కూడదు.

2. కూపాకారముగ నొక చక్రమును వ్రాసి దానియందు రోహిణి నక్షత్రము మొదలు తూర్పునుండి మూడేసి నక్షత్రముల వంతున 8 దిక్కులలోను 24 గును మధ్యను 3 ను లిఖించి సదరు స్థలములలో నున్న నక్షత్రములలో చంద్రుడున్న నక్షత్రము సదరు చక్రమునకు తూర్పు, దక్షిణము, నైఋతి, వాయువ్య, దిక్కులలో నున్న యెడల జలనాశనమనియును, ఆగ్నేయ దిశలో నున్నచో పూర్ణ జలమనియును పశ్చిమ దిశలో నున్నచో అమృతసమానమనియు, ఉత్తరదిశలో నున్నయెడల రుచికరంబనియును, ఈశాన్యదిశలో నున్నయెడల లవణయుక్తము మనున్ను, మధ్యలో నున్నచో, త్వరలో జలప్రదమనియును గ్రహింపబడెను.

3. నివసించు గృహమునకు భావి యీశాన్యభాగమునందుండె నేని ఐశ్వర్యము, తూర్పున వృద్ధి, ఆగ్నేయమున పుత్రనాశనము. దక్షిణమున సౌఖ్యము, నైఋతి అరిష్టము, పడమర మరణము, వాయువ్యమున సంపద, ఉత్తరమున శత్రుభయము, మధ్యప్రదేశమున నాశనము కలుగును.

## స్థ ల ప రీ క్ష

శ్లో॥ శుభ్రవస్త్రోపమాతోద్ర । తుల్యావర్ణశిలాధరా
అక్షయం కురుతేతోయం । సర్వప్రాణిసుఖావహమ్॥

(జలార్గళశాస్త్రము)

తా॥ తెల్లనిబట్టవంటిరంగును, తేనెవర్ణముగల రాళ్లును ఎచ్చట నుండునో, సమస్తప్రాణులకు సుఖమును కల్గించు జలసమృద్ధికలిగి యుండును. వైడూర్యములు, పెసలు, తుమ్మెదలు ఈవర్ణముగల రాళ్ళసమీ

పమునందు సమృద్ధిజలముండును. ముత్యములు, వెండి, బంగారము, హరిదళము వర్ణములుగల రాళ్లుండు చోట సంపూర్ణ జలముండును. మద్ది చెట్టు, బిల్వవృక్షము, నెల్లి చెట్టు, తిప్పతీగ, పొన్నగంటి, యిప్పియున్న తావులందు జలముండును. నల్లని మృత్తికగాని, యెఱుపుమృత్తికగాని, కుశ దర్భలున్నచోటులందు జలముండును. ఖర్జూరంబు, నేలతాడు, తామర, కానుగ, పచ్చిక ఇవిగల ప్రదేశమునందు జలముండును. సున్నపురాళ్ళతోగూడి యెఱ్ఱనగు భూమియందు చేదుజలముండును. తీగలు, ఆకులు, దట్టముగను, పచ్చగనుండు ప్రదేశమునందు జలముండును. కపిలవర్ణముగల నేలయందు ఉప్పునీరుండును. తెల్లటి నేలయందు కొంచెముప్పనగల నీళ్ళుండును నల్లని నేలయందు తియ్యని నీళ్ళుండును. కొండమీఁద కొండయున్నచో ఒక మట్టు ప్రమాణమున నీరుండును.

## తటాకవాపీ ఆకారనిర్మాణ ఫలములు

శ్లో॥ త్రికోణం చతురస్రంచ । వర్తులం వా త్రిరంస్మృతమ్ ।
ధనుషం కలశం పద్మం । మధ్యమం తజ్జలాశ్రయమ్ ॥

(విశ్వకర్మప్రకాశిక)

తా॥ నీళ్ళకై నిర్మించబడిన వాపీతటాకాదులు త్రికోణాకారముగానైనను నాలుగంచులు గలదానిగానైనను ఉండెనేని మిక్కిలి శ్రేష్టము. ధనురాకారముగానైనను కలశాకారముగానైనను పద్మాకారముగానైనను ఉండెనేని మధ్యమఫలము.

సర్పాకారము, ఉరగాకారము, ధ్వజాకారములు కూడవు. న్యూనాకారము సౌఖ్యము కలుగఁజేయును. నూయి వర్తులాకారము శుభము.

## తటాక నిర్మాణము

శ్లో॥ పాలీప్రాగపరాయితాంబుసుచిరం దత్తేనయామ్యోత్తరా
కల్లోలైరవదారమేతి మరుతాసాప్రాయశః ప్రేరితైః

తాం చేదిచ్ఛతి సార దారు శిరసాం సంపాతి మాసారయే
త్పాషాణాది భిరేవ వా ప్రతిచయం క్షుణ్ణం ద్విపాశ్వాదిభిః।
(జలార్గళశాస్త్రము)

తా॥ చెరువులకు గట్టులు, ప్రవాహములను గట్టిగ బహు కాలము జలముండును. దక్షిణోత్తరములు దీర్ఘగట్టులు చేసిన పడమటి గాలి కొట్టుటచేత అలలు లేపబడి గ్రొంచును. జలము లేని చెరువు అశు భము చెఱువుగట్టులు మిగుల బలముగల కొయ్యలచేనైనను రాళ్ళతో నైనను ముందుప్రక్క దృఢముగా గట్టి వెనుకప్రక్క మన్నుపోసి, ఏనుగులు, పశువులు, మొదలగువాటితో త్రొక్కించి గట్టిగానుండు నట్లు చేయవలయును.

## గట్లమీఁద చెట్లునాటుట

శ్లో॥ కకుభవటామ్రప్లక్షకదంబై । స్ననిచులజంబూ వేతసనీపైః
కురవకతాలాశోకమధూకై । ర్వకులవిమిశ్రైశ్చావృతతీరామ్॥
(జలార్గళశాస్త్రము)

తా॥ చెఱువుగట్టుమీఁద వంకమద్ది, మఱ్ఱి, మామిడి, జువ్వి, కడిమి, ఎఱ్ఱగన్నేరు, నేరేడు, ప్రబ్బలి, నేప, ఎఱ్ఱగోరింట, తాటి, అశోకము, ఇప్ప, పొగడ, మొదలగు వృక్షములు వేయవచ్చును.

## నడబావి నిర్మాణము విశేషము

శ్లో॥ సీరాయుక్సలిలాం సుఖావతరణాం తీరస్థపుష్పద్రుమాం
కూజద్వృక్షవిహంగమాంసు తరుణీమత్యాయతాం దీర్ఘికామ్।
కుర్యాత్తత్రసముల్లసత్కమలినీ పత్రైశ్చక్వచిచ్ఛామలాం ।
శ్యామాలోకనవమాలికాం విదధతీం నీలోత్పలానిక్వచిత్॥
(విశ్వకర్మప్రకాశిక)

తా॥ అనేక జలనాడులతో గూడినదియును అంత సుఖముగ దిరుగునట్టి సోపానములు గలదియును కిలకిలారవములుచేయు నానావిధ పక్షులతోఁగూడిన పూలచెట్లు గలదియును, మిక్కిలి చిత్రములగు పడవలు గలదియును, విధవిధములగు కమలములు, కలువలుగలిగి మిగుల విశాలముగను యుండు నడబావిని నిర్మింపవలయును.

## ఉద్యానవన నిర్మాణము

శ్లో॥ విలంబినో యత్రతటద్రుమస్థానిపుష్పైర్లోకా ఘనాః ప్రసవేష్టితాస్తైరివ
శమంది శంతః కలహంస భ షణ్మ్యాచిద్ర నేగ్స్రైప్య రిమునోగి మాణీః॥

తా॥ వాపీకూపతటాకాదులు విస్తరించు పుష్పఫలాదులచే మిక్కిలి దట్టంబులగు కొమ్మలతో వ్రేలుచుండు వృక్షములు గలదియును, కలహంస, కారండవ, చక్రవాక, జలకుక్కుటాది పక్షిసమూహములతో గూడిన యనేక కొలంకులు గలదియును, మల్లె మొల్లె మొదలగు సువాసనగల పుష్ప వృక్షములు గలదియును, అగు ఉద్యానవనమును నిర్మింపవలయును.

## ఆరంభ ముహూర్తములు

శ్లో॥ అనూరాధా మఖాహస్త । రేవతి సూత్తరాత్రయే ।
రోహిణీయుగళే పుష్యే । ధనిష్ఠా శ్రవణ యేతథా
పూర్వాషాఢాభిదేచైవ । శుభేనూశిశుభేదినే
వాపీకూప తటాకానా । మారంభః కథితో బుధైః॥ (జలార్గళ)

తా॥ అనూరాధ, మఖ, హస్త, రేవతి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రోహిణి, ధనిష్ఠ, పుష్యమి, శతభిషము, పూర్వాషాఢ, ఈనక్షత్రములయందు శుభమాస శుభదినములందు వాపీకూపతటాకాది ఆరామములు ప్రారంభించుట శుభము.

## ఎట్టిజలమునైనను మధుర జలముచేయుట

శ్లో॥ అర్జునముస్తోశీరైస్సనాగకోశాత కామలచూర్ణైః
కతక ఫలచూర్ణయుక్తైః కూపేయోగః ప్రదాతవ్యః
కలిలం కటుకం లవణం విరసం సలిలంచా శుభగంధి భవేత్
తదనేకభవత్యమలం సరసం శుభగంధి గుణైరసరైశ్చయుతం॥

తా॥ వాపీకూపాదులయందు, క్షారోదకము గలిగియుండినను, బురదగ నుండినను, వగరుగ నుండినను, దుర్గంధముగను ఉండినచో వంకమద్ది, చెట్టుపట్ట, తుంగగడ్డలు, వట్టివేళ్ళు, శొంఠి, బీరవిత్తులు. ఉసిరికపొట్టు, చిల్లగింజలు వీనిని చూర్ణముచేసి, ఆజలములందు కలిపినచో మధురజలములగును.

శ్రీపరమేశ్వరాయనమః

# వ్యవసాయ సామెతలు

—: * :—

1 అంటుబొడ్డు ఆస్రులు ఎద్దులకు, జాడుబొడ్డు చనుకట్టు ఆవులకు

2 అకాలపువాన ఆరికలకు గండము

3 అచ్చివచ్చిన భూమి అడుగెడే చాలును

4 అడవిపంది చేనుమేసిపోతే, ఊరపంది చెవులుకోసినట్లు

5 అడుగడుగునకు నిక్షేపము

6 అతివృష్టి, అనావృష్టి

7 అత్తపలికినకోడలు, చిత్తపట్టిన వరిచేను, బాగౌను

8 అదును తప్పినపైరు, ముదిమివాని బిడ్డ ఒకటే

9 అదునుకాని పదును

10 అదునున పొదలో చల్లినా పండును

11 అదనెఱిఁగి సేద్యము, పదనెఱిఁగి పైరు వెయ్యవలెను

12 అనోరాధ కార్తిలో, అనాధకఱ్ఱయినా యీనును

13 అనోరాధ కురిస్తే, మనోరోగాలు పోతాయి

14 అన్నికార్తులు కురియకపోతే, హస్త తప్పక కురియును

15 అన్నీ పండిన కాపువానికి, అన్నం కఱవు

16 అయితే ఆరిక, కాకుంటేకంది, దున్నిచల్లితే శనగ

17 అయిదు నాళ్ళపైచాలే తోలినట్లు

18 అరవైఆరు పిండివంటలు ఆవుచంటిలోనున్నవి

19 ఆర్లగొడ్డు పితుకునా?

20 అశ్వని కురిస్తే, అంతా నష్టము

21 అశ్వని కురిస్తే, అడవిలోకి చాలదు

22 ఆకాశధార దిగినచో, ప్రజలందరు బ్రతుకుదురు

23 ఆకాశము గుఱ్ఱుత్రొక్కుడు పడితే, అతిసమీపములో వర్షమున్నది

24 ఆ కాపకు ఈకంపాని లిపి ఒకట్లోపిగా

25 ఆగోడ్డు మంచిదైత్తే అశ్వనిలోనే పుష్యకార్తెయేల

26 ఆబుజ్జలో విత్తినాతే

27 ఆముదప్పు విత్తులు ముత్యాలగునా?

28 ఆరికకు చిత్తగండం, ఆముదానికి సల్లగండం

29 ఆరికచల్లిన రెడ్డికి, ఆలూమగలకు ఒకటేచీర

30 అడుగకోసిన ముహూర్తమునవే, కంది కొండాకోయవలెను

31 ఆరుద్రకార్తె విత్తనాసకె, అన్నముపెట్టిన యింటికి సేగిలేదు

32 ఆరుద్ర ఉఱిమితే అఱువానలుపాడు

33 ఆరుద్రతో అమనుసరి

34 ఆరుద్రకురిస్తే, దారిద్ర్యములేదు

35 ఆరుద్ర బిందిస్తే, అఱువైరోజులు వఱపు

36 ఆరుద్రలో అడ్డెడు చల్లితే పుట్టెడు పండును

37 ఆరుద్ర ప్రథమపాదమున విత్తనమువేస్తే అనంభములు చేయును

38 ఆరుద్ర వానలకు ఆమ్లములు ఫలించును

39 ఆరుద్రవాన, అదునువాన

40 ఆరుద్రాన వేసిన ఆరికె, ఆకులో పెట్టిన అన్నముతో సమము

41 ఆవుచేనిలో మేస్తుంటే, దూడగట్టున మేయునా?

42 ఆవులు ఆవులు కుమ్ముకులాడి, లేగలకాళ్ళు విఱుగద్రొక్కినట్లు

43 ఆశ్లేషలో అడుగుకు ఒకచినుకుపడినా, అడిగినన్ని వడ్లుపండును

44 ఆశ్లేషకురిస్తే, ఆరోగ్యము కలుగును

45 ఆశ్లేషకురిస్తే, ముసలియెద్దు అంకెవేయును

46 ఆశ్లేషకార్తె అసిరితే అసిరినట్లు, మసిలితే మసిలినట్లు

47 ఆశ్లేషలో వూడ్చినట్లయితే, అడిగినంతధాన్యము

48 ఆశ్లేషవాన, అరికాలు తేమ

